ఇటీవల నవీన్‌నగర్‌లో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశం, కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేక దీర్ఘోపన్యాసాలతో కొనసాగింది. ఇంతేకాదు. ఈ సందర్భంలో, భారత దేశ ప్రజాతంత్ర భవిష్యత్తును గురించి ఆందోళన పడే వారందరినీ తీవ్రంగా కలత పెట్టే అనేక భావాలు ఈ సమావేశంలో వెల్లడించబడ్డాయి.

అనేక ముఖ్య విషయాలలో నాగపూర్ సమావేశమూ, నవీన్ నగర్ సమావేశమూ పూర్తిగా పరస్పర విరుద్ధమైన పంథాలో నడిచాయి. మితవాదుల దాడి ప్రభావాన్ని గుర్తించడం నాగపూర్ చర్చలలో, తీర్మానాలలో కన్పించుతుంది. కాని నవీన్‌నగర్ సమావేశంలో కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రధానంగా ప్రస్ఫుటమయింది.

"చైనా కమ్యూనిజం మన దేశ సరిహద్దులను ఉల్లంఘించి దాని అఖండతకు ప్రమాదం కల్గించుతూంది; భారత కమ్యూనిస్టులు మన దేశ ప్రజాతంత్రానికి ప్రమాదం తెస్తున్నారు" అనే ప్రచారానికి కాంగ్రెసు పరిపాలకపార్టీ, కాంగ్రెసు నాయకత్వమూ తామే పూనుకొనడం ఆశ్చర్యకరమైన విషయం.

## మితవాదులనుండి ఒత్తిడి

రెండవ పంచవర్ష ప్రణాళిక దీనస్థితిని గురించి ఒక్క మాట కూడా చెప్పకుండానే, మూడవ "బృహత్" ప్రణాళికను గురించి పెద్ద ఆర్భాటంగా మాట్లాడుతున్నారు. స్వతంత్రపార్టీ సిద్ధాంతం, కాంగ్రెస్ పార్టీకి లోపలనుండి చిచ్చుపెడుతూవుంటె, అలాంటి స్వతంత్రపార్టీతో ఏదో స్నేహపూర్వక వాగ్వాదాలలాంటి వాటిని కాంగ్రెస్ కొనసాగించుతూంది. ఆచరణలో పెద్దపెద్ద పైరివేటు పెట్టుబడిదారుల జాతీయ వ్యతిరేక కోర్కెల విషయంలో, ఊహించదగిన అన్నివిధాలా ఒకప్రక్క

లొంగుతూనే, ప్రభుత్వ రంగాన్ని సమర్థించుకుంటూ వాగాడంబర ప్రదర్శనం గావించుతోంది. జాతీయ, అంతర్జాతీయ వ్యవహారాలు రెండిండింటిలోనూ, అత్యంత మితవాదుల అభ్యుదయ నిరోధక ధోరణి వత్తిడి ఎక్కువైంది. వారు దానికి తగిన ఫలితాలను పొందు తున్నారనే సత్యాన్ని ఇదంతా వెల్లడిచేస్తోంది.

కాంగ్రెసు నాయకులు, మన దేశంలో పార్లమెంటరీ ప్రజా తంత్రానికి ముఖ్యనిర్మాత అయిన ప్రధాని నెహ్రూ, "భారత ప్రజా తంత్రం ప్రమాదానికి గురిఅయింది" అని వక్రరూపంలో నినాదం లేవ దీయడం, ప్రజాతంత్ర సంరక్షణ పోరాటం అనే పేరుతో కమ్యూనిస్టు లకు వ్యతిరేకంగా పిస్టల్ గురిచూపడం, గందరగోళం కల్గించుతూంది.

ఇటీవల ప్రజాతంత్రం, పార్లమెంటరీ పద్ధతులను గొంతునులిమి, దానిస్థానే క్రూరనియంతృత్వం ఏర్పరచిన ప్రతిచోటా, 'కమ్యూనిజంపై పోరాటం' అనే కపట నినాదాన్నే లేవనెత్తారు. ఈ పరిస్థితులలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలోని చర్చలను పరిశీలిం చుదాం.

## కమ్యూనిస్టులపై దాడి

ప్రధాని నెహ్రూ, కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరా గాంధీలు కమ్యూనిస్టుపార్టీపై సాగించిన తీవ్రదాడితో నవీన్‌నగర్ సమావేశం ప్రారంభమైంది. తర్వాత ఈ సమావేశ చర్చల ధోరణికి, వీరి ఉపన్యాసాలు మార్గం చూపాయి.

పశ్చిమ బెంగాల్ అసెంబ్లీలో చెప్పులు విసురుకొన్న దుర్ఘట నను ఆధారం చేసుకొని ప్రధాని నెహ్రూ "అలాంటివాళ్ళతో (కమ్యూ నిస్టులతో) నాకు సంబంధించినంతవరకు ఎలాంటి రాజీ ఉండబోదు" అని అన్నారు. మనం స్వాతంత్ర్యం పొందినతర్వాత పన్నెండేళ్ళుగా మన దేశంలోవున్న అనేక శాసనసభలలోగాని, పార్లమెంటులోగాని జరిగిన దుర్ఘటన ఇదొక్కటే. శ్రీ నెహ్రూకు స్వభావసిద్ధమైన ధోర ణిలో, పైమాటలకు సమతూకంగా యిలా అన్నారు.

"ఈ విమర్శనను ఏ ఒక్క ప్రత్యేక గ్రూపునకు నేను ఉద్దేశించ లేదు. కొంతవరకు మనమంతా ఇందులో నేరస్థులమని నేను భావించు తున్నాను."

మనదేశంలో ప్రజాతంత్ర పద్ధతులపై, ప్రజాతంత్ర జీవితమార్గం పై దాడిచేసి అపాయం కల్గించడంలో ప్రధాన బాధ్యత కమ్యూనిస్టు పార్టీదేనని ఆయన ఆరోపించారు. కాంగ్రెస్ పార్టీకికూడా ఈ నేరంలో కొద్దిభాగం ఉందని కేటాయించడానికి ప్రయత్నించారు. ఆవిధంగా కమ్యూనిస్టులపై దాడి మరింత క్రూరంగాశక్తి వంతంగా చేశారు.

కమ్యూనిస్టులపై మంటలు రేగగొట్టిన తర్వాత శ్రీ నెహ్రూ ప్రపంచానికి ఇలా హామీ యిచ్చారు: "దేశ ప్రజాతంత్ర జీవితాలకు సంబంధించినంతవరకు, ప్రజాతంత్ర పద్ధతులను అన్ని విధాలానిలబెట్టు తామనీ ప్రతీ పార్టీకి అన్ని విధాలా అవకాశం ఇస్తామనీ నేనుపూర్తిగా స్పష్టం చేయదలచుకున్నాను."

పశ్చిమ బెంగాల్ అసెంబ్లీలో చెప్పు విసిరిన వుదంతానికి శ్రీ నెహ్రూ ప్రజాతంత్ర ఆత్మ గాఢండా సంక్షోభపడి "ఎలాంటి పరిణామాలు కలిగినా సరే, మేం ఇలాంటి ఘటనను సహించబోము" అని నొక్కి చెప్పారు.

కాంగ్రెసుపార్టీ, కాంగ్రెసు ప్రభుత్వమూ మన దేశంలో ప్రజాతంత్ర పద్ధతులపైన, ప్రజాతంత్ర జీవితంపైన బాహాటంగా పదే పదే దాడులు జరుపుతూంటే, వాటికి వ్యతిరేకంగా శ్రీ నెహ్రూ మాట్లాడివున్నట్లయితే, పై ప్రకటనకు ప్రజలు హర్షించేవారు.

## అభివృద్ధి నిరోధకులతో మైత్రి

ఈ ప్రజాతంత్ర పద్ధతులను, రీతులను బాహాటంగా ఉల్లంఘించుతుంటే, ప్రజలు అసమ్మతులను తెలియజేసినపుడు నెహ్రూతో సహా కాంగ్రెస్ నాయకత్వం, వాటిని విసర్జించుకోడానికి ఏమాత్రం లక్ష్యపెట్టలేదు సరిగదా, నవీన్‌నగర్ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ

సమావేశంయొక్క ఇష్టాగోష్ఠి సభలో కాంగ్రెస్ నాయకత్వం ఇలా అభిప్రాయపడింది.

"భారతదేశంలో ప్రజాతంత్రం కులమతశక్తుల, కమ్యూనిస్టు శక్తుల దాడికి గురి అయింది. ఈ రెండు అపాయాలను ఎదుర్కోడానికి తగిన చర్యలను తీసుకోవాలి."

(హిందూ, సెప్టెంబరు 29)

కేరళలో మధ్యంతర ఎన్నికలలో కమ్యూనిస్టులపై పోరాడటానికి కాంగ్రెసు, ప్రజా సోషలిస్టు పార్టీ, ముస్లింలీగ్, నాయర్ సేవాసమితి, కాథలిక్ చర్చిల ఎన్నికల కూటమిని ఇదే సమయంలో, ఇదే సమావేశం సిగ్గులేకుండా ఆమోదించింది.

కాంగ్రెస్ అధ్యక్షురాలు ఇంకా ఇలా చెప్పింది: "కుల, మత ధోరణిలో ఇంకా ఆలోచిస్తున్నవారిని జాతీయ దృక్పధానికి మరలించటానికి సత్వర చర్యలవలంబించాలి." కాథలిక్ చర్చిని, ముస్లింలీగును, నాయర్ సేవాసమితిని, అకాలీలను, ద్రవిడకజగంను, గణతంత్ర పరిషత్తును, ఇంకా ఇలాంటి అనేక శక్తులను కాంగ్రెస్ గాఢంగా కౌగలించుకొన్నాక, ఇంకా బయటనున్న శక్తులనుకూడా కాంగ్రెస్‌లో ఇముడ్చుకోవాలని ఆమె చాలా ఆదుర్దాపడుతున్నది.

ఒక ప్రక్క కులమత శక్తులతో పోరాడాలనే కబుర్లు అలా అంటూనే, ఆచరణలో కరుడుగట్టిన కులమత శక్తులతో కలయిక కొనసాగించుతోంది కాంగ్రెస్. "కమ్యూనిస్టులనుండి ప్రజాతంత్రాన్ని సంరక్షించాలి" అనే పేరుతో, ప్రజాతంత్రానికి బద్ధశత్రువులైన అదే కులమత శక్తులను ముఖ్యంగా బలపరచడం జరుగుతూంది.

ప్రజాతంత్రానికి ప్రమాదం కమ్యూనిస్టులవల్ల ఏర్పడిందనడం పూర్తిగా అసత్యం. అసలు అపాయంలో వున్నది చాలా కాలంగా కాంగ్రెస్ అనుభవించుతూన్న గుత్త అధికారం.

భారత ప్రజాతంత్రానికి దిన దినం అపాయం హెచ్చుతున్నమాట నిజమే. ఆ విషయమై ఆత్మసంతృప్తితో ఉండటం మరణ

సదృశమే. కాని ఈ అపాయాన్ని సరిగా ఎదుర్కోవాలంటే, పెంపొందు తున్న దాడినుండి మన ప్రజాతంత్రాన్ని సంరక్షించుటలో గాఢాభి లాషకలవారంతా, ఈ ప్రమాదం వాస్తవంగా ఎక్కడినుండి వస్తు న్నదో అనే విషయాన్ని తెలుసుకోవాలి. భారత రాజ్యాంగం ప్రకారం వయోజన వోటింగ్ ప్రాతిపదికపైన మొదటి జనరల్ ఎన్నికలు జరిగి అప్పుడే దాదాపు ఎనిమిదేండ్లయింది.

## అమృతసర్ నిర్ణయం

పార్లమెంటరీ సంస్థలలో ఈ ఎనిమిదేండ్ల అనుభవాన్ని పురస్క రించుకొని అమృతసర్ కాంగ్రెస్‌లో కమ్యూనిస్టుపార్టీ సోషలిజానికి శాంతియుత పరివర్తనలో విశ్వాసాన్ని ఖచ్చితంగా తెలియజేసింది. అమృతసర్‌లో ఆమోదించిన కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో ఇలా చెప్పబడింది :

"సంపూర్ణ ప్రజాతంత్రాన్ని, సోషలిజాన్ని శాంతియుత పద్ధ తులద్వారా భారత కమ్యూనిస్టుపార్టీ సాధించడానికి ప్రయత్నించు తుంది. శక్తివంతమైన ప్రజాపుద్యమాన్ని అభివృద్ధి చేయడంద్వారా పార్లమెంటులో మెజారిటీని సంపాదించి, ప్రజా సమ్మతిద్వారా దానిని బలపరచి, కార్మికవర్గమూ, దాని మిత్రులూ, అభివృద్ధి నిరోధకుల ప్రతి ఘటనను అతిక్రమించగలరు; ఆవిధంగా ఆర్థిక, సామాజిక, ప్రభుత్వ నిర్మాణంలో ప్రధానమైన మార్పులను తీసుకురావడానికి ప్రజాభీష్టం యొక్క సాధనంగా పార్లమెంటును చేయగలరు."

దేశంలోని పార్లమెంటరీ ప్రజాతంత్రాన్ని అవహేళనపాలు చేస్తూ, ప్రజాతంత్ర పద్ధతులకు, ప్రజాతంత్ర జీవిత విధానానికి దూరం గాను వ్యతిరేకంగాను పోతున్నది నిజానికి కాంగ్రెస్‌పార్టీ, కాంగ్రెసు నాయకత్వమున్నూ – దీనిని గమనించడం, అర్థంచేసుకోవడం ఏమంత కష్టమైన పని కాదు.

ఈ ఎనిమిదేండ్లలో కమ్యూనిస్టుపార్టీ పార్లమెంటులోను, అనేక రాష్ట్ర శాసనసభలలోనూ పెద్ద, నిజమైన ప్రతిపక్షపార్టీగా

పెంపొందింది. అంతేగాక కేరళరాష్ట్రంలో మెజారిటీ సంపాదించి, అవినీతికరమైన, అస్థిరమైన కాంగ్రెసు ప్రభుత్వంస్థానే ప్రభుత్వాన్ని ఏర్పరచి, పని చేసింది. కమ్యూనిస్టులకు అనుకూలంగా వోట్లు త్వర త్వరగా హెచ్చాయి. 1957 జనరల్ ఎన్నికలలో 130 లక్షల వోట్లు కమ్యూనిస్టుపార్టీకి వచ్చాయి. ప్రజల ప్రజాతంత్ర నిర్ణయమే కమ్యూనిస్టుపార్టీని, ముఖ్య ప్రతిపక్షపార్టీగాను, కాంగ్రెసుకు నిజమైన ప్రత్యామ్నాయ పార్టీగాను నిలిపే గౌరవస్థానాన్ని యిచ్చింది.

కాంగ్రెస్ పరిపాలక పార్టీ ఏదో దయదలచినందున కమ్యూనిస్టు పార్టీ ఈ హోదాను, ప్రజల అభిమానాన్ని చూరగొనగల్గలేదు. కాంగ్రెస్ నాయకత్వం, దాని ఉపగ్రహాలు సాగించిన నిందా, నిశ్చిత ప్రతిఘటనలను ఎదుర్కొని, ప్రజానీకంమధ్య స్వార్థత్యాగంతో కృషి చేసినందున ప్రభుత్వం అవలంబించే ప్రజా వ్యతిరేక చర్యలను, విధానాలను రాజీ లేకుండా ఎదుర్కొని పోరాడటంవల్లా, ప్రజాతంత్ర పద్ధతులను ప్రజాతంత్ర జీవిత విధానాన్ని సంరక్షించేందుకు నిర్విరామ పోరాటం సాగించుట ద్వారాను ఈ హోదాను, ప్రజాభిమానాన్ని కమ్యూనిస్టు పార్టీ సంపాదించింది.

ఇంతేగాదు. పార్లమెంటులోను, బయటాకాంగ్రెస్‌కు పెద్ద ప్రతిపక్షపార్టీ పాత్రను వహించాలని తీవ్రమైన పోరాటంసాగించిన ప్రజాసోషలిస్టుపార్టీని అవతలకు త్రోసి, కమ్యూనిస్టుపార్టీ ప్రస్తుతస్థితికి వచ్చినది.

కమ్యూనిస్టుపార్టీని త్రోసివేసే ప్రయత్నంలో ప్రజాసోషలిస్టు పార్టీకి కాంగ్రెస్ నాయకత్వం ఆదరణ వుంది. పెద్ద ప్రతిపక్షపార్టీగా, ప్రజాసోషలిస్టుపార్టీ వచ్చియున్నట్లయితే, కాంగ్రెస్ నాయకులు దానిని లెక్కచేసేవారు కాదు. వాస్తవానికి అది వాంఛనీయమైన పరిణామంగా వారు భావించేవారు. కమ్యూనిస్టుపార్టీయే పెద్ద ప్రతిపక్ష పార్టీగా రావడంతో వారికి వణుకు పుట్టుకొచ్చింది.

పార్లమెంటరీ ప్రజాతంత్రం గురించి నొక్కినొక్కి చెప్పే శ్రీ నెహ్రూతోసహా కాంగ్రెసు నాయకత్వం, ప్రజల ప్రజాతంత్ర నిర్ణయాలను ఔదలదాల్చడంవల్లనే కమ్యూనిస్టుపార్టీకి ఈ హోదా

వచ్చిందా ? "ప్రజాతంత్ర సోషలిజం" గురించి శపథంచేసే ప్రజా సోషలిస్టు పార్టీ, దాని నాయకత్వమూ, ప్రజల ఈ నిర్ణయంతో సమాధానపడతారా ?

లేదు. వాస్తవ విషయాలు దీనికి విరుద్ధంగా వున్నాయి. ప్రజా నిర్ణయాన్ని వారు అతి హేయభావంతో చూశారు. సక్రమంగానీ, అక్రమంగానీ తమకు చేతనైన ప్రతి సాధనంద్వారా, ఆ నిర్ణయాన్ని తలక్రిందులు చేయాలని వారు యత్నించుచున్నారు. కాంగ్రెస్ పార్టీకి ప్రత్యామ్నాయపార్టీగా కమ్యూనిస్టుపార్టీ వస్తున్నదనే తమకు అయిష్టమైన విషయాన్ని చూడగానే, పాలకవర్గాల మనసుల్లో విపరీతమైన భయం ఏర్పడింది. కమ్యూనిస్టుల బారినుండి ప్రజాతంత్రాన్ని కాపాడాలనే వంకతో ప్రజాతంత్రంపైన స్వైరి ఆవేశంతో దాడులు కొనసాగించడానికి మూలకారణం ఈ భయమే.

## మన ప్రజాతంత్ర విధానంలోని బలహీనత

మన పార్లమెంటరీ ప్రజాతంత్రం ప్రపంచంలోనికల్లా పెద్దదని తరచు మనం చెప్పుకొంటాం. అంతేకాదు, డంబంగాకూడా చెప్పుకుంటాం. 40 కోట్ల ప్రజలుగల మనదేశం ప్రజాతంత్ర పంథాపై అడుగుపెట్టడం అందరూ హర్షించారనేది నిస్సందేహమే అయినా దానిలోవున్న పెద్దబలహీనతను గుర్తించకపోవడం మనకు సముచితం గాదు.

కాలముడిగి బూజుపట్టిన, చరిత్ర వదలివేసిన భూస్వామ్య, అర్ధ భూస్వామ్య పునాదిపై బ్రహ్మాండమైన పార్లమెంటరీ ప్రజాతంత్ర భవనం కట్టబడింది. పూర్తిగా శుభ్రంచేసి, కొత్తగా గట్టి పునాదులపై దానిని నిర్మించలేదు. బ్రిటిషువాళ్ళు, నిరంకుశోద్యోగ యంత్రంతో విడిచిపెట్టిన పునాదిలాగానే ఇదీ వుంది. పూర్తిగా నిరక్షరాస్యులు, దారిద్ర్య బాధితులు, క్రూరంగా పీడింపబడినవారూ అయిన ప్రజలపైన మన మేమైనా సంపాదించినదుంటే దాన్ని సంరక్షించుకొని విస్తరించుకోవలసిన బాధ్యత పడింది.

## ప్రజాతంత్రానికి తూట్లు పొడిచిన కాంగ్రెస్ చరిత్ర

భారత ప్రజాతంత్రంలో గల యీ మూల బలహీనతలను తొలగించే చర్యలు గైకొనేది పోయి, కాంగ్రెస్ ప్రభుత్వం, దాన్ని మరింత విస్తృతపర్చే పనులు చేస్తూ, దాని స్థిరత్వాన్నే భంగ పరుస్తున్నది.

1952 ఎన్నికల అనంతరం, మద్రాసు రాష్ట్ర అసెంబ్లీలో, కాంగ్రెస్ మైనారిటీగా వచ్చింది; బలోపేతమైన ఐక్య ప్రజాతంత్ర సంఘటన సవాలును ఎదుర్కోవలసి వచ్చింది. కాంగ్రెస్ నాయకత్వం మర్యాదకరమైన ప్రజాతంత్ర పద్ధతులను త్యజించి, మైనారిటీగా వున్న తమను మెజారిటీపార్టీగా చేసే యింద్రజాలాన్ని చేయడంకోసం రాజగోపాలాచారిని రంగంపైకి తోసింది. అప్పటి గవర్నరు, అసెంబ్లీలో మెజారిటీగా వున్న ఐక్య ప్రజాతంత్ర సంఘటన నాయకుని విస్మరించి, మైనారిటీపార్టీ (కాంగ్రెస్) నాయకుడగు రాజాజీని మంత్రివర్గం ఏర్పర్చవలసిందిగా కోరాడు. పార్టీల, గ్రూపుల వ్యక్తుల రాజకీయ విశ్వాసాలు బేరంలోకి వచ్చాయి మామూలు వస్తువుల్లాగానే. "మీరు కాంగ్రేసేతరులను అధిక సంఖ్యలో ఎన్నుకున్నప్పటికీ దాన్ని తారుమారు చేయగల అస్త్రం మావద్ద వుంది సుమా" అనే "ప్రజాతంత్ర" పాఠాన్ని ప్రజలకు నేర్పింది కాంగ్రెస్.

ఆంధ్రరాష్ట్రంలోని కాంగ్రెసు ప్రభుత్వం విశ్వాసరాహిత్య తీర్మానంపై ఓడిపోయింది. ఆ సందర్భంలో, ప్రధాన ప్రతిపక్ష పార్టీ నాయకుని పిలిచి, ప్రభుత్వాన్నేర్పర్చడం సాధ్యమేమో అడగాలనే అవుసరం కనిపించలేదు గవర్నరుగారికి. శాసనసభ రద్దు చేయబడింది, ఆంధ్ర రాష్ట్రంపై రాష్ట్రపతిపాలన రుద్దబడింది. ప్రజాతంత్ర పద్ధతులపట్ల, ప్రజాతంత్ర జీవితంపట్ల ప్రజల్లో నమ్మకం గల్గించే చర్యయేనా యిది?

అవినీతి, అసమర్థత, అంతర్గత తగాదాల మూలంగా 1954లో, తిరుకొచ్చిలో కాంగ్రెస్ ప్రభుత్వం కూలిపోయింది. తదుపరి జరిగిన మధ్యంతర ఎన్నికల్లో కమ్యూనిస్టులు, ప్ర. సో. పార్టీ తదితరులు గల, అతివాద ఐక్యసంఘటన అధికస్థానాలు గెల్చుకున్నది.

రాష్ట్రంలో అతివాద ఐక్యసంఘటన ప్రభుత్వం ఏర్పడాలనే ప్రజానిర్ణయాన్ని వమ్ముచేసే దురుద్దేశంతో, ప్ర. సో. పార్టీ నాయకులతో కుమ్మక్కయింది. ప్రభుత్వాన్నేర్పర్చే అవకాశం 101 సభ్యులుగల అసెంబ్లీలో కేవలం 19 మందిగల ప్ర. సో. పార్టీకి కల్పించింది కాంగ్రెసు నాయకత్వం. ప్రభుత్వాన్నేర్పర్చే హక్కు కాంగ్రెసు పార్టీకి లేదని ప్రజలు తీర్పిచ్చినా, కాంగ్రెసు ప్రోత్సాహంతో నిలబెట్టిన ప్ర. సో. పార్టీ ప్రభుత్వం నెలకొల్పారు. ప్రజాతంత్ర పద్ధతులపట్లా, ప్రజల కోరికలపట్లా కాంగ్రెస్ నాయకత్వం చూపిన హేయభావాని కింతకంటె వుదాహరణ కావాలా?

1957 ఎన్నికల్లో ఒరిస్సా రాష్ట్రంలో కాంగ్రెస్ మైనారిటీగా వచ్చింది. అయినా కాంగ్రెస్ పార్టీ నాయకుడు హరికృష్ణ మెహతాబ్‌నే ప్రభుత్వం ఏర్పరచమని కోరారు; మైనారిటీగానున్న తమ పార్టీని మెజారిటీగా చేయడానికి చర్యలు తీసుకోమన్నారు. తిరిగి అసెంబ్లీలో యీ ప్రభుత్వం ఓడిపోయింది; కాని ప్రభుత్వంనుండి వైదొలగవద్దని ఆయనకు కాంగ్రెసు ప్రభుత్వం సలహా యిచ్చింది. ప్రభుత్వంలోనే వుండాలన్న తాపత్రయంతో మంత్రివర్గం, ఏవేవో కుంటి సాకులపై శాసన సభ్యులను అరెస్టు చేసింది. ప్రజాతంత్ర వ్యతిరేకమైన యీ చర్యలను కాంగ్రెసు నాయకత్వం బలపర్చుతూ వచ్చింది.

భారత రాజ్యాంగంలోగల "అత్యవసర నిబంధనలు" కాంగ్రెసు నాయకుల చేతిలో ఆటవస్తువులయ్యాయి. పాలకపార్టీ యిరుకునబడినపుడల్లా, యీ పేరు చెప్పి, రాష్ట్రపతి పాలన విధిస్తున్నారు. 1954లో పెప్సూరాష్ట్రంతో ప్రారంభమై 1959 కేరళలో జరిగిన ఘటనలతో యిట్టి జోక్యాలు అనేకం జరిగాయి.

ప్రజాతంత్ర నియమాలకూ, సాంప్రదాయాలకూ వ్యతిరేకంగా వ్యవహరించే యీ ధోరణియొక్క పరాకాష్ఠ 'కేరళ మంత్రివర్గం బర్తరఫు, సక్రమ పద్ధతుల్లో ఎన్నికైన ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే దురుద్దేశంతో, కాంగ్రెసుపార్టీ తనకు తానుగా, హింసాయుత ఉద్యమాన్ని ప్రేరేపించింది. చివరకు దానినే సాకుగాజూపి మంత్రివర్గాన్ని బర్తరఫు చేసింది.

## వివిధ రాష్ట్రాల్లో

"మీరు మా అభ్యర్థులనుగాని, మాతో పెద్దగా తగాదాలేని 'మర్యాదస్థులగు' పార్టీలవారినిగాని ఎన్నుకోండి. అలాగాక, కమ్యూనిస్టులనుగాని ఎన్నుకన్నారంటే, మీాతీర్పును ఉల్లంఘించడమేగాదు; ప్రజాతంత్రాన్నికూడా భగ్నపరుస్తాం" అని ప్రజలను హెచ్చరించడంగాక మరేమిటిది ?

"ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేస్తుందా ?" అన్న సామెతలావుంది.

ప్రజాతంత్రాన్ని కాంగ్రెస్ కేంద్ర నాయకత్వమే యింతగా ఉల్లంఘిస్తుంటే, అసలు ప్రజాతంత్రమంటేనే గిట్టని భూస్వామ్య శక్తులతో నిండివున్న రాష్ట్ర కాంగ్రెస్ పాలకుల చేతుల్లో ప్రజాతంత్రాని కెట్టి గతి దాపురిస్తుందో పూహించడం కష్టంకాదు.

ఎన్నికల్లో అవినీతికి పాల్పడి, శాసనసభలు తమ దర్బారులుగా పరిగణిస్తున్నారు. ప్రజాతంత్రానికి వ్యతిరేకంగా వారి నేరాలు పెరిగి పోతున్నాయి.

పశ్చిమ బెంగాల్ కాంగ్రెస్ ప్రభుత్వం, ప్రతిపక్షం పదే పదే కోరినా పూర్తిగా అనివార్యమైతే తప్ప శాసనసభను సమావేశ పర్చడంలేదు.

## ప్రజలంటే అసహ్యం

శాసనసభల చర్చలకు, ప్రశ్నలకు యిచ్చే సమాధానాలు ప్రతిపక్షంపట్ల చూపే అగౌరవం, ప్రభుత్వ యంత్రాంగపు నిరంకుశత్వం -యివన్నీ ప్రజాస్వామికవాదుల్లో తీవ్రమైన ద్వేషాన్ని కల్గిస్తున్నాయి. అంతేగాదు; రాష్ట్ర శాసనసభల కాంగ్రెసుపార్టీల్లోనే తిరుగుబాట్లకు దారితీశాయి. పంజాబు, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలలో రేగిన తగాయిదాలు దీనికి తాజా ఉదాహరణలు.

ప్రజపట్ల, ప్రజాతంత్రంపట్ల, ప్రజా ప్రతినిధులపట్ల కాంగ్రెసు పాలకులు ప్రదర్శించే ద్వేషానికి ఉదాహరణ శ్రీ సంజీవరెడ్డి యిచ్చిన ఉపన్యాసం. 1955 ఎన్నికల్లో స్వతంత్ర అభ్యర్థి నెగ్గిన నియోజక

వర్గానికి వెళ్లారాయన. తమకుగల కొన్ని అత్యవసర యిబ్బందుల్ని తొలగించవలసిందిగా ప్రజలు మహజరు పెట్టుకొన్నారు. "గాడిదలకు మేత వేస్తూ ఆవులను పాలివ్వమంటే యిస్తాయా ?" అని అడిగారాయన. అప్పుడక్కడనే వున్న ఆ శాసనసభ్యుడు, అశ్లీలమైన యీ వుపన్యాసం పట్ల, శాసనసభలో అభ్యంతరం తెలిపారు.

సంజీవరెడ్డిగారే, కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గ అతిథిగా వెళ్లారు. మర్యాద, మంచీ లేకుండా, "ఆంధ్రలో కమ్యూనిస్టులను మేము పాతాళానికి తొక్కేశాం. మీరుకూడా మా ఆదర్శాన్ని పాటించండి" అని వుపదేశించారు. ఆయన ఈ మాటలన్నది కేరళలో కమ్యూనిస్టులు మంత్రివర్గంలో ఉండగానే అన్న విషయం గమనార్హం.

ఇదీ, ప్రజాతంత్రంపట్లా, పార్లమెంటరీ జీవితవిధానం పట్లా కాంగ్రెసు నాయకులకు గల 'గౌరవం !'

పంచాయితీలు, మునిసిపాలిటీలు వగైరా స్థానిక సంస్థలయెడ వీరి వైఖరి మరీ శోచనీయం. స్వప్రయోజనాలకొరకై, ఎన్నుకోబడిన వేలాది పంచాయితీలను కలంపోటుతో రద్దుచేయటం సర్వసామాన్యం. వందలాది మున్సిపల్ కౌన్సిళ్ళను రద్దుచేసి, తమ కనుసన్నల్లో మెలిగే స్పెషల్ ఆఫీసర్లకు అధికారం యిస్తున్నారు. ఈ సంస్థలకు సంవత్సరాల తరబడిగా ఎన్నికలు జరపకపోవటం మామూలు. రైతుల తీర్పుకు నిలబడాల్సివస్తుందన్న ఫికరుతో, పంజాబు ప్రభుత్వం పంచాయితీ ఎన్నికలను తిరిగి వాయిదా వేసింది. స్వతంత్రం వచ్చి పన్నెండేళ్ళయినా, కలకత్తా కార్పొరేషన్ ఎన్నికల్లో వయోజన వోటింగ్ హక్కు యివ్వలేదు.

స్వప్రయోజనోద్ధరణకై ప్రాకులాడే వీరి దృష్టినుండి, సహకార సంఘాలు, బ్యాంకులు కూడా తప్పించుకోలేదు. ప్రతిపక్ష పార్టీల పట్ల మొగ్గుచూపే వ్యక్తుల చేతుల్లోవున్న పంచాయితీలు, మున్సిపాలిటీలు సహకార సంఘాలు వగైరాలకు గ్రాంట్లు, ఆర్థిక సహాయం, తదితర విషయాల్లో విచక్షణాయుత వైఖరి ప్రదర్శింపబడుతున్నది. ప్రజాతంత్రం వివిధ స్థాయిల్లో హత్య చేయబడుతోంది. మనది లౌకిక

రాజ్యాంగమనీ, మత, కుల తత్వాలు మన శత్రువులనీ ప్రధాని నెహ్రూదగ్గరనుండి కాంగ్రెసు నాయకులంతా ఉద్ఘోషిస్తుంటారు. కాని చెప్పే మాటలకు భిన్నంగా ప్రవర్తించడమే ఆచరణలో కనబడుతోంది.

మనదేశంలోగల కుల, మతతత్వ సంస్థలు – భూసామ్య ఆర్థిక-సాంఘిక దృక్పథం కలవిమాత్రమే కాదు. ఆ సంస్థలు భూస్వామ్య అర్థ భూస్వామ్యవర్గ ప్రయోజనాలను ప్రతిబింబిస్తున్నాయి. ప్రజాస్వామ్య మంటే, అణుమాత్రమైనా సహించని యీ వర్గాలతో కూడిన సంస్థలతో, తమ అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం రాజకీయ ఒప్పందాలు చేసుకుంటున్నది, కాంగ్రెసుపార్టీ.

## విషాద దృశ్యం

ఆంధ్రలో కుల, మత తత్వశక్తులని పరిగణించ తగిన శక్తులు కాంగ్రెసుపార్టీ; కలుపలలేకుండా చేసింది కాంగ్రెసునాయకత్వం. 1955 మధ్యంతర ఎన్నికల్లో కమ్యూనిస్టులను ఓడించటంకోసం యీ శక్తులన్నిటినీ తనలో యిముడ్చుకున్నది. మద్రాసులో ద్రవిడకజగంతో కలిసింది కాంగ్రెసుపార్టీ 1957 ఎన్నికల్లో. పంజాబులో, అకాలీపార్టీ మొత్తంగానే కాంగ్రెసులో చేర్చుకోబడింది. ఒరిస్సాలో మిశ్రమ మంత్రివర్గాన్నేర్పర్చడం కొరకు, గణతంత్ర పరిషత్తుతో చేతులు కలిపింది. కేరళలో, నాయర్ సర్వీస్ సొసైటీతోనూ, కాథలిక్ చర్చితోనూ, ముస్లింలీగుతోనూ కాంగ్రెసు చేతులు కలపడంతో పరాకాష్ఠ నందుకున్నది.

రాష్ట్ర స్థానిక స్థాయిలలో యీ కలయిక – కులమత శక్తులతో కాంగ్రెస్ కలయిక – మరింత హృదయవిదారకంగా వుంది.

ఇన్ని పనులు చేస్తూ, భారత ప్రజాతంత్రాన్ని కమ్యూనిజం నుండి రక్షించడానికి తాము కంకణధారులైవున్నట్లు కాంగ్రెసు నాయకులు చెప్పుకోవడం ఆత్మవంచనా, పరవంచనా తప్ప వేరొకటి కాగలదా? కులమత తత్వాలవల్ల అంతర్గతంగా తొలిచివేయబడుతున్న రాజకీయ పార్టీ ఏదైనా వుంటే అది ఒక్క కాంగ్రెసే.

ఇవన్నీ దృష్టిలో వుంచుకొని చూస్తే ప్రజాతంత్రానికి మతశక్తులు బద్ధ విరోధులని, వాటితో పోరాడడానికి కాంగ్రెస్ నిలబడుతుందనిగాని, నవీన్‌నగర్‌లో కాంగ్రెస్ ప్రకటించిన ఆశయాల పట్ల ఎవరికైనా విశ్వాసం కుదురుతుందా?

## ప్రజా పోరాటాలకు వ్యతిరేకత

ప్రజలు తమ దైనందిన కోర్కెలను తెలియజేసుకోవడం, శాంతియుత సమావేశాలు, ప్రదర్శనలు, పోరాటాలు జరుపుకోవడం ప్రజాతంత్రంలో ప్రజలకుగల ప్రాథమిక హక్కు. కాని భారత దేశంలో యిట్టివన్నీ ప్రజాతంత్ర విరుద్ధమైన నేరాలుగా పరిగణింపబడుతున్నవి. లాఠీచార్జీలు, తుపాకి కాల్పులకు గురిచేయబడుతున్నవి.

స్వతంత్ర, ప్రజాతంత్ర భారత దేశంలో పోలీసు లాఠీచార్జీలు, తుపాకి కాల్పులూ, పరతంత్ర బానిస భారతంలోకంటె హెచ్చుగా వుంటున్నాయంటే అతిశయోక్తికాబోదు. బొంబాయి, అహమ్మదాబాదు, జంషెడ్‌పూర్, పంజాబ్, మద్రాసు, ఆంధ్ర, పశ్చిమబెంగాల్‌లలో వందలాది కాల్చి చంపబడ్డారు. హేయమైన ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం, మన దేశ న్యాయశాస్త్రంలో శాశ్వత స్థానాన్నలంకరించింది.

భారత దేశంలో రాజకీయాలు, ప్రదర్శనలు, యాత్రలవరకు దిగజారి, అనేక రకాలైన ఆందోళనలు జరగడం మనం చూస్తున్నాం. పంజాబ్ వీటిని చవిచూచింది. ఇతరచోట్లకూడా, సహజమైన ప్రజాతంత్ర పద్ధతులను విడనాడి మనం యీ పద్ధతులకు పూనుకుంటున్నాం.

## ప్రజాతంత్రంలో పోలీసుల పాత్ర

కాంగ్రెసు పాలనలో ప్రజలకు సుఖప్రదమైన జీవితం నిరాకరించబడడమే కాదు; తమ హక్కులు, కోర్కెలకోసం శాంతియుతంగా పోరాడే హక్కుకూడా నిరాకరించబడింది; ఆ శాంతియుత పోరాటాలు, లాఠీచార్జీలకూ తుపాకికాల్పులకూ గురిచేయబడుతున్నాయి. పంజాబ్ ప్రభుత్వం విధించిన అక్రమ అభివృద్ధిపన్నుకు వ్యతిరేకంగా పంజాబ్ రైతులు సాగించిన చరిత్రాత్మక పోరాటమూ, పశ్చిమ బెంగాల్‌లో

లక్షలాది ప్రజానీకం సాగించిన బలవత్తరమైన ఆహారోద్యమమూ శ్రీ నెహ్రూ దృష్టిలో ప్రజాస్వామ్య వ్యతిరేకమైనవే. కాని ఆ నెహ్రూ గారి దృష్టిలోనే, కేరళ కమ్యూనిస్టు మంత్రివర్గాన్ని వత్తిడిద్వారా కూలద్రోయడానికి విమోచన సమర సమితి నాయకత్వాన సాగిన దౌర్జన్యపూరిత చర్యలు, అపూర్వమైన "ప్రజా వెల్లువ" గా కన్పించాయి! పాలకవర్గాలు ఇట్టి ద్వంద్వనైఖరిని, విచక్షణనూ అవలంబిస్తే భారత ప్రజాతంత్రం మనగలదా?

ప్రజల్ని భయపెట్టడం, దోపిడీపరుల కండగా తమ శక్తిని వినియోగించడం మామూలు ప్రజాతంత్రంలో పోలీసులు చేయరాని పని. కాని భారతదేశంలో పోలీసులకు అంతకుముందు బ్రిటిష్ పాలకులు యిచ్చిన హక్కులను అట్టిపెట్టడంతోబాటు మరింత విస్తృతాధికారాలు యివ్వబడుతున్నాయి. పోలీసులకు యివ్వబడిన దారుణమైన అధికారాలను తగ్గించడానికి కేరళకమ్యూనిస్టు మంత్రివర్గంచేసిన స్వల్ప యత్నంకూడా కాంగ్రెస్ కేంద్ర నాయకత్వం సహించలేకపోయింది. ఇదంతా ప్రజాతంత్రాన్ని రక్షించడమేనా? ఇవి ఆలోచిస్తుంటే "నేను వలచింది రంభ, నేను మునిగింది గంగ" అన్న సామెత గుర్తుకొస్తుంది.

పశ్చిమ బెంగాలు శాసనసభలో జరిగిన విచారకర సంఘటన నెహ్రూగారికెంతో కష్టం కలిగించింది. ఆ సందర్భంలో, తానుగా చెప్పవిసరిన పోలీసుశాఖా మంత్రిని వదలివేసి, కమ్యూనిస్టులపైన ఆయన ఆగ్రహం వెలిబుచ్చారు. శాసనసభలో ఒకరిపైనొకరు చెప్పులు విసురుకోవడం పూర్తిగా అనుచితమన్న శ్రీ నెహ్రూ అభిప్రాయంతో మేమూ ఏకీభవిస్తున్నాం. కాని, ఆహారోద్యమ సందర్భంగా ప్రజల్ని కాల్చి, హత్యచేసినందుకు పశ్చిమ బెంగాలుప్రభుత్వం, పోలీసుశాఖా మంత్రి విచారం వెలిబుచ్చకపోవడం మానవత్వమేనా? మర్యాదయేనా? ప్రజాతంత్ర ప్రవర్తనేనా? అని అడగడం అనుచితం కాదనుమంటాను.

కేరళలో బర్తరఫుచేయబడిన మంత్రులకు ప్రజలు స్వాగత సన్మానాలు చేస్తున్నారు. శ్రీ నెహ్రూ అనుచరులు, చనిపోయినవారి

పుత్రేలు వెలికి తీసి యీసభల సందర్భంలో ప్రదర్శించుతుంటే పండిత నెహ్రూ పన్నత్తి ఖండించరేమి?

సంవత్సరం క్రిందట, ఆసియా ఖండంలోని దేశాలు ఒక దాని వెనుక ఒకటిగా మిలిటరీ నియంతల క్రిందికి పోతుంటే, పరిణామాలను పరిశీలించి, తన అభిప్రాయాలు ప్రజల ముందుంచింది కమ్యూనిస్టుపార్టీ.

## ఎటువైపునుంచి ప్రమాదం?

మా ప్రధాన కార్యదర్శి శ్రీ అజయ్‌ఘోష్, పాకిస్తాన్ ఉత్పాతం అన్న తన వ్యాసంలో యిలా హెచ్చరించారు:

"అమెరికన్ పెట్టుబడి కిస్తుబడుతున్న సౌకర్యాలవల్ల యీ ప్రమాదం వృద్ధివిస్తున్నది. గుత్తేదారులు, భూస్వాముల ఒత్తిడికి లొంగడంవల్ల యీ ప్రమాదం వృద్ధివిస్తున్నది. దేశంలో ప్రజాస్వామ్యమూ, కమ్యూనిస్టుపార్టీల అభివృద్ధిపట్ల పాలకవర్గాల్లో ఏర్పడుతున్న భయంవల్లా, పాలకపార్టీ, ప్ర. సో. పార్టీలు రెచ్చగొడుతున్న కమ్యూనిస్టు వ్యతిరేకతవల్లా ఈ ప్రమాదం ఏర్పడుతున్నది. అధికారతత్వం ధోరణీ, ప్రజాతంత్ర నియమోల్లంఘనలవల్ల యిది ఏర్పడుతున్నది. అభివృద్ధినిరోధకులు, ప్రజాస్వామ్య వ్యతిరేకులూ, మన ప్రభుత్వ యంత్రాంగంలోనూ, సైన్యంలోనూ ఏర్పరచుకున్న కీలకస్థానంవల్లా, సైన్యంలో దేశభక్తిని, ప్రజాతంత్ర భావాలను కలిగించడంపట్ల చూపుతున్న అశ్రద్ధవల్లా యీ ప్రమాదం ఏర్పడుతున్నది." (ఇంగ్లీషు ప్రతి పేజీ 18)

## తరువాత ఘటనలు పై హెచ్చరికను ధృవపరచాయి

కేరళ ప్రభుత్వం రద్దుచేయబడటం, పశ్చిమ బెంగాల్‌లో ఆహారోద్యమం కొనసాగడం, భారత - చైనా సరిహద్దు తగాదా, భారత కమ్యూనిస్టులపైన ప్రజల ఆగ్రహాన్ని మరల్చడానికి ప్రయత్నాలు చేయడం, మన దేశంలోని కొన్ని రాజకీయపార్టీల, శక్తుల మద్దతుతో జనరల్ తిమ్మయ్య రాజీనామా చేస్తానని బెదరించడం - ఇవన్నీ జరగడానికి చాలా కాలంముందే పై హెచ్చరిక చేయబడింది. ఆ హెచ్చరికలోని ప్రతిమాటా నేడు రుజువవుతూంది; ప్రమాదం ఇంకా తీవ్ర స్వరూపం దాల్చుతోంది.

భారత ప్రజాతంత్రంపై దాడిచేస్తున్నది కమ్యూనిస్టులనే ఆరోపణ పూర్తిగా సత్యదూరం. కమ్యూనిస్టులు చేస్తున్నారని ఆరోపించిన దాడినుండి ప్రజాతంత్రాన్ని కాంగ్రెసునాయకత్వం సంరక్షించ బూనుకొన్నదని అనడం వంచనయే. నేడు భారతదేశంలోగాని, ప్రజాతంత్రం నాశనం గావింపబడిన ఆసియా దేశాలలోగాని, ఇందుకు కమ్యూనిస్టులను నిందింప వచ్చునా? సామ్రాజ్యవాద అనుకూలురు, భూస్వాముల అనుకూలురు, కమ్యూనిస్టు వ్యతిరేకులు, తదితర అభివృద్ధి నిరోధక శక్తులు రాజకీయ హత్యలు, రాజకీయ సైనిక తిరుగుబాట్లు మొదలైన బందిపోటు పద్ధతులను అవలంబించుతున్నాయి. ప్రజాతంత్రం, అభివృద్ధి, స్వేచ్ఛలకు వ్యతిరేకంగా తమ ప్రయోజనాలను కాపాడుకోడానికి తెగించి ప్రయత్నాలు చేస్తున్నారు. గత పదేండ్లలోను మహాత్మాగాంధీతో ప్రారంభమై లియాఖత్ ఆలీఖాన్, ఆంగ్‌సాన్, బండారునాయకేవరకు అందరూ ఈ దుష్టశక్తుల, వారిచే నియమితులైన హంతకుల చేతిలోనే దుర్మరణం పాలయ్యారు.

థాయ్‌లాండ్, బర్మా, పాకిస్తాన్‌లలో ప్రజాతంత్రాన్ని నాశనంచేసి సైనిక ప్రభుత్వాలను నెలకొల్పితే, ఇండోనేషియాలో ప్రజాతంత్రం ఇప్పటికే ప్రమాదానికి గురి అయితే, ఇంకా అలాంటి ప్రమాదాలే ఇతర దేశాలకు వ్యాప్తి చెందుతూఉంటే, అవన్నీ ఏదో ఒక అభివృద్ధి నిరోధక పరిపాలక ముఠాలవల్లనో, సామ్రాజ్యవాద అనుకూల ముఠావల్లనో జరిగినవే. అంతేగాని దానికి బాధ్యులు కమ్యూనిస్టులని అనడం పూర్తిగా తప్పు.

భారత ప్రజాతంత్రానికి ప్రథమ శత్రువు కమ్యూనిస్టు పార్టీ అని నెహ్రూతో సహా పరిపాలక కాంగ్రెస్‌పార్టీ కనిపెట్టడం, దానిపై రాజకీయ సిద్ధాంతదాడిని ప్రారంభించడం విచారకరమైన విషయం. కాంగ్రెస్ ప్రకటించిన ఆశయాలపైననే మొదలంటా దాడిచేస్తున్న స్వతంత్ర పార్టీనుండి ఈ ప్రమాదం సంభవించుతున్నదని కాంగ్రెసు నాయకత్వం గుర్తించ నిరాకరించుతోంది. భారత - చైనా సంబంధాలు చెడిసి వుండటం అవకాశంగా తీసుకొని, ప్రజాసోషలిస్టు, జనసంఘాల నాయకత్వాలు తమ స్వతంత్ర తటస్థ విదేశాంగ నీతికి

తెస్తున్న ప్రమాదాన్ని కాంగ్రెసు కావాలని కళ్ళుమూసుకొని చూడ నిరాకరించుతోంది.

ప్రజాసోషలిస్టుపార్టీ, స్వతంత్రపార్టీ, జనసంఘం మొదలైన రాజకీయపార్టీల మద్దతుతో సర్వసేనాధిపతి రాజీనామా ఇస్తానని బెదరించితే, ఆ బెదరింపుపట్ల అది పూర్తిగా ఉపేక్ష వహించింది. మన దేశాన్ని యుద్ధకూటమిలోకి ఈడ్వాలనే సామ్రాజ్యవాదుల పన్నాగాలను అది పూర్తిగా మరచిపోతూవుంది. భారత ప్రజాతంత్రానికి నెమ్మదిగా గోతులు తవ్వుతున్న శక్తులకు వీటి అన్నిటిద్వారా అది ప్రోత్సాహమూ, ప్రోద్బలమూ ఇస్తోంది. తన ప్రజాతంత్ర విరుద్ధ పద్ధతులు, విధానాలు, ఆచరణలద్వారా కాంగ్రెస్ నాయకత్వం, ప్రజాతంత్రాన్ని గంగపాలు చేయడానికి ప్రయత్నించే దుష్టశక్తులకు సారవంతమైన క్షేత్రాన్ని తయారుచేస్తూంది.

## తీవ్ర సంక్షోభం

భారత ప్రజాతంత్రం నేడు తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటూంది. కమ్యూనిస్టుల బారినుండి ప్రజాతంత్రాన్ని సంరక్షించాలనే మిషతో నెహ్రూతో సహా కాంగ్రెస్ అగ్రనాయకత్వం కమ్యూనిస్టులపై పోరాట పంథాను అవలంబించడంతో ఈ సంక్షోభ తీవ్రత మరీ హెచ్చింది.

అనేక సంవత్సరాలు పోరాటాలద్వారా వోటర్లు పెంచి పోషించిన పెద్ద ప్రతిపక్షపార్టీపై, పరిపాలకపార్టీ యుద్ధం ప్రకటించితే, పార్లమెంటరీ ప్రజాతంత్రం మన దేశంలో ఎలా బ్రతికి బట్టకట్టగలదు ?

కాంగ్రెస్ నాయకత్వం బాహాటంగా ఈ పంథాను అనుగమించుతోంది. కేరళలో కమ్యూనిస్టు నాయకత్వాన ఉన్న ప్రభుత్వాన్ని రద్దుచేసింది. ఆ తర్వాత, ప్రతిరోజూ దాడి తీవ్రతరమైంది. ఇటీవలి దృశ్యం ఏమంటే, భారత-చైనా సరిహద్దు తగాదా తీసుకొని, కమ్యూనిస్టులను అప్రతిష్టపాలు చేయడం.

కేరళలో వచ్చేఎన్నికలలో కమ్యూనిస్టులను ఓడించాలనే ఆదుర్దాతో, కమ్యూనిస్టు పార్టీని బలహీనపరచడానికి, అప్రతిష్టపాలు

చేయడానికి అన్నివిధాలా ప్రయత్నించుతోంది. మన దేశంలో పెద్ద ప్రజాతంత్ర, ప్రతిపక్షపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీని గట్టిదెబ్బ కొట్టి 1962 జనరల్ ఎన్నికలలో ప్రమాదంలేని విజయాన్ని తప్పక సాధించాలని అది ప్రయత్నించుతోంది.

మూడవ ప్రణాళికను గురించి వింటున్నాం. వాస్తవంగా ఈ ప్రణాళికలో అందరికన్నా ప్రప్రథమంగా అగ్ర పారిశ్రామికులకు వర్తకులకు పెద్ద లాభాలు, హామీలు ఇవ్వబడుతున్నాయి.

సామాన్యప్రజలపైన ఎక్కువ భారాలు పెట్టబడుతున్నాయి. ఇంతేగాక అమెరికా డాలర్లకోసం మన పాలకులు విపరీతంగా పరుగులెత్తుతున్నారు.

బలమైన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ప్రజాతంత్ర, ప్రతిపక్షపు తీవ్ర ప్రతిఘటన, ఈ విధానాలకు, పద్ధతులకు వుంటుందని వారికి పూర్తిగా తెలుసు.

ఆ విధంగా, సంకుచిత స్వార్థప్రయోజనాల కోసం, పరిపాలక వర్గాలకు సందేహాస్పదమైన లాభాలకోసం—అనగా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా కేరళలో విజయాన్ని సాధించడం, కాంగ్రెసుకు నిజమైన ప్రత్యామ్నాయ పార్టీగా పెద్ద ప్రతిపక్షపార్టీగా కమ్యూనిస్టుపార్టీ లేకుండా చేయడం, వచ్చే జనరల్ ఎన్నికలలో సులభంగా గెలవటానికి మార్గాన్ని సుగమనం చేయడం, ధనవంతులు మరింత ధనవంతులయ్యే మార్గంలో మూడవ పంచవర్ష ప్రణాళికను పెట్టడం – ఈ పనులన్నిటికిగాను, కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని కాంగ్రెసు నాయకత్వం కావాలని ప్రారంభించింది. కొందరు కరుడు కట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకశక్తులు, పత్రికలు కమ్యూనిస్టుపార్టీని నిషేధించాలని బహిరంగంగా సూచించడానికి సాహసించాయి.

## హెచ్చరిక

కమ్యూనిస్టు వ్యతిరేకపంథా, నిజమైన పార్లమెంటరీ ప్రజాతంత్ర పంథాకు పూర్తిగా భిన్నంగావుంది. ఈ జగద్విదిత సత్యం నేడు మన దేశంలో రూపొందుతూన్న నిర్దిష్టపరిస్థితులకు మరీ అన్వయించుతుంది.

జీవితంలో ప్రతి సమస్యా ఒక కఠోర పరీక్షకు గురి అవుతుంది. కమ్యూనిస్టు వ్యతిరేక వెర్రిని ఒకసారి పెద్ద పెట్టున రెచ్చగొట్టిన తర్వాత, దానిని ఉపయోగించుకొని దేశ రాజకీయ జీవితంలో పైచేయి సంపాదించ ప్రయత్నించే శక్తులు అత్యంత మితవాద, అభివృద్ధి నిరోధక వర్గాలు, పార్టీలు. పంచశీలను నాశనం చేయాలని, ఏ కూటమిలో చేరని మన స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, ప్రణాళికాబద్ధమైన అభివృద్ధిని. ప్రజాతంత్ర అభివృద్ధినీ, నాశనం చేయదలచినవీ శక్తులు.

కమ్యూనిస్టు వ్యతిరేక పంథాను ప్రవేశపెడుతున్న వారిచే ముఖ్యంగా ప్రమాదానికి గురియైన ప్రజాతంత్రాన్ని ప్రజాతంత్ర సంస్థలను, ఈ సమస్యలను క్షుణ్ణంగా గుర్తెరిగి, సంరక్షించుకొనేందుకు సంసిద్ధమయ్యేందుకుగాను, ఇదంతా ప్రజలకు గుర్తు చేస్తున్నాం.

కాంగ్రెస్‌లోని ప్రజాతంత్రవాదులందరి భుజస్కంధాలపైన, ఈ క్లిష్టసమయంలో గురుతర బాధ్యత పడుతోంది. ప్రధాని నెహ్రూయే కొంచెంసేపు ముందు వెనుకలుచూచి తీవ్రంగా దానిని గురించి ఆలోచించాలి. ఈ ప్రమాదకరమైన ధోరణిని - రాజకీయ కుట్రలు, సైనిక తిరుగుబాట్లు సాగించడానికి అభివృద్ధి నిరోధకులకు ధైర్యాన్నిచ్చే ధోరణిని తిరోముఖం పట్టించడానికై, తాము ఏపార్టీకి చెందినవారైనా భారత ప్రజాతంత్ర అభివృద్ధికి పాటుబడటంలో పాత్రవహించిన వారంతా, ప్రజాతంత్ర పద్ధతులను ఆశయాలను కోరేవారంతా, ప్రశాంతంగా ఆలోచించి సకాలంలో తగు చర్యలు తీసుకోవాలి.

విదేశీ, స్వదేశ అభివృద్ధి నిరోధకశక్తులు అనేక ప్రాంతాలనుండీ సాగించే తీవ్ర కవ్వింపు దాడులనుండి దేశంలోని ఇతర ప్రజాతంత్ర అభ్యుదయ శక్తులతో కలిసి మన ప్రజాతంత్రాన్ని కాపాడటానికి కమ్యూనిస్టుపార్టీ తన యావచ్ఛక్తినీ ఉపయోగించుతుందని శపథం చేస్తూంది.

ప్రజాతంత్ర సంరక్షణ పోరాటం, మన దేశ భవిష్యత్తుకు, అభివృద్ధికి అత్యంత ప్రాముఖ్యత వహించుతోంది. (అక్టోబరు 3)



స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ.